# భగవత్కీర్తనలు



రుద్రరాజు సీతారామరాజుగారి సతీమణి
బంగారక్ష్మ్మిగారిచే విరచితము

నవంబర్ 1963 :: వెల 50 N. P.

# భగవత్కీర్తనలు



రుద్రరాజు సీతారామరాజుగారి సతీమణి

బంగారమ్మగారిచే

విరచితము

పోడూరు



నవంబర్ 1963 : : వెల 50 N. P.

# మనవి



ఇంకను వ్రాసిన పద్యములు, పాటలు, మంగళహారతులు లుకొలుపులు మొదలైన అన్నిపాటలు వ్రాయుటకు నాకుశక్తి మర్ధ్యమేమియులేదు. అదియునుగాక పదములు సమకూర్చి ని చరణములు పెట్టిగాని; తాళరాగములు సరిపోవునట్లుగాని వ్రాసినవికావు. ఇవి అప్పుడప్పుడు భగవంతునియందు కలిగిన ందాది పారవశ్యముచేతను నాజీవితకష్టములను పెరుమాళ్ళకు ్నవించుకొన్నవేగాని పురాణసంబంధముగాగాని శాస్త్ర సమ్మ ముగాగాని వ్రాసినవికావు. భగవంతుని కటాక్షమువల్ల వాచా పలికించినవేగాని, ఈపాటలు పద్యములు వ్రాయవలెనని యత్నముచేసి వ్రాసినవిగావు. అప్పుడప్పుడు సమయాను లముగా పాడినవేగాని నేను కలము కాగితము పుచ్చుకొని సినవికావు. నేను 15 సం॥ నుంచి తరచు నర్సాపురములో ంచుచు పెద్దలను పెరుమాళ్ళను సేవించి వారి కటాక్షమును టవలనను అదియునుగాక నర్సాపురములో సేవచేసియున్న

## II

శ్రీ అమరవాది లక్ష్మీనరసమ్మగారు ఎక్కువగా నాయందు బంధుప్రేమ సఖ్యత చూపుటచేతను; వారితో సాంగత్యమువలన ఆ తల్లిలోనున్న శక్తి నాలో కొంత ప్రవేశించుటవలన ఇవి వ్రాయగలిగితిని. అదియునుగాక 25 సం॥ క్రితము మేము అందరము అంతర్వేదిపాలెంలోనుండగా హరికథాకాలక్షేపము జరుగుచుండగా మావారందరు కాలక్షేపమునకు వెళ్ళగా నేను యింటి దగ్గరేయున్నాను. హరికథలకు నాటకములకు, సినిమాలకు వెళ్లుట నాకు అలవాటులేదు. చిన్నతనమునుంచి మాతండ్రిగారికి సేవజేసిన మహాపతివ్రతతురాలును, భగవద్భాగవత కైంకర్యపరురాలునునగు మాతల్లి సీతమ్మగారు శ్రీవైష్ణవులవలన మాయింటిలో కాలక్షేపములు వినుచుండెడివారు ఆరోజున అందరు హరికథ వినుటకు వెళ్ళగా భజన చేయవలెనను ఉత్సాహము కలిగినది. శ్రీరామ పటమును ఒకచోటనుంచి దీపారాధన చేసితిని. కాని నేను బడిలో చదివినప్పుడేగాని మరల యెన్నడు పాటపాడుట గాని వ్రాతవ్రాయుటగాని చేయలేదు అందుచేత పెరుమాళ్ళను భజించుటకు పాటయేమియు పాడలేకపోతిని శ్రీరామస్మరణ మాత్రము చేయుచుంటిని. ఇట్లు రామస్మరణ చేయుచుండగా

రామా! భద్రాచలరామా! పరంధామా! పరమపురుషా! సుగుణాకర సుందరవిగ్రహా! రామా నన్నుబ్రోవుమా శ్రీరామ ననుగావుమా" అను రామాయణము కీర్తన గానవచ్చినది. ఇది భక్తురాలగు మాతల్లిగారి కటాక్షమే అయియుండునని నా అభిప్రాయము. మరియు కృష్ణపటమును జూచి ఆనందపరవశనై కృష్ణుని పాటలు పాడితిని.

ఇందులోనున్న ఆండాళు మంగళహారతులు రంగనాయకుల మంగళహారతి పాలకొల్లులో చిన్నగోపురము కోవెలలో వేంచేసియున్న పెరుమాళ్ళకు లక్షతులసీ పూజ చేసినప్పుడు శ్రీభూనీలాదేవులనే మంగళహారతిని ఆండాళుకు లక్షపుష్పముల పూజ చేసినప్పుడు రత్నశ్రీ చూర్ణము స్ఫాటిక తిరుమణి అను మంగళహారతి లక్షనామములతో శ్రీచూర్ణము తాయారుకు పూజచేసినపుడు పాడిన మంగళహారతి రంగనాయకులకును అప్పుడప్పుడు ఆయా సమయములలో పాడినపాటలు ఇందులో 'జడమతిని' అనుపాట వ్రాయుటకు కారణము మన శ్రీమన్నారాయణాచార్యస్వామిగారు, గోపాలాచార్యులుగారు బదరిలో

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



ముందుగా తిరుమంత్ర క్రతువు చేయ సంకల్పించుకొని నర్సాపురములో వేంచేసియున్న శ్రీ ఆదికేశవులను ఎంబెరుమానారులను వారి ఆచార్యులను సేవించుకొనుటకు నర్సాపురం వచ్చినపుడు నాస్థితి వారికి విన్నవించుకొనుటకు పాడిన పాటగాని వారికి విన్నవించుకొనలేక పోతిని. ఎప్పుడువచ్చిన పాట అప్పుడు పాడుటయే గాని వ్రాసి అచ్చువేయించవలెనని సంకల్పము లేకపోయెను. ఈమధ్య చాలమంది భక్తులు ఆత్మీయులు అచ్చువేయించమని పలుమారు పలుకుచుండగా యిది నాకు శక్యముగానిదైనను పెరుమాళ్ళు ఆండాళ్ళు నా అండనుండి వారివారి కోర్కె తీర్చుకొనుటకు అచ్చువేయించుచున్నారు. ఇదియంతయు పెద్దలు పెరుమాళ్ళ కృపయే. నేను తృణప్రాయము. మరియు వారికి నేను కలమువలె నుపకరణము మాత్రమే.

ఇట్లు,
భాగవతదాసురాలు
రుద్రరాజు బంగారమ్మ

పోడూరు
4_11_63

శ్రీరస్తు.

శ్రీమతేరామానుజాయనమః

1

ఎందులకూ యీ సంసారంబున నుండగ జేసితివి పుండరీక పురు
షోత్తమ యదుకులభూషణ యోకృష్ణ!
పన్నగశయనా పాపవిమోచన నను పాలించగదే।
నిఖిల జగదాధారా నీవే దిక్కని నిరతము నినుభజించగ
కనికరమించుకలేదా ॥ ఎందు ॥
పాహి మురారే పద్మదళేక్షణ నను పాలించగదే।
నే జేసిన తప్పులన్నీ వొప్పులుగ కనిపెట్టగదే।
పలుమరు నిను ప్రార్థింప నేను విడచుట తగదుకదా ॥ ఎందు ॥
జడమతిసి మూఢురాలను జగంబునకు విరుద్ధురాలను
ఓర్వగజాలను ఉష్ణశీతల దేహబాధలకును
చేయగజాలను హరిపూజావిధానమున్
భాయగజాలను బదరీనారాయణున్

పుష్పమెచ్చటనైన పుష్పించియుండగా చూచి రోజ్వేను
తెచ్చి అర్చించువరకు; అర్చించుటకేదైన అడ్డుకలిగియున్న
వాడిపోవుననుచు వగచుచుందు
తులసిపుష్పములకు స్వచ్ఛతీర్థమునకు ఎంతదవ్వయిన ఏగుచుందు
భక్తులెవ్వరైన పిలున నచ్చోటకేగుచుందు
భక్తి తప్పియున్న చెప్పకుండపోయి చేరనింక
బహిః ప్రపంచమునకు విరుద్ధముగ బ్రతుకుచుంటి
శాస్త్రసమ్మతమైన చదువు చదువగలేదు
పంచసంస్కారంబు ప్రాప్తంబు లేదాయె హరినిజేరుటెట్లొ
విమలచరిత

2

(నర్సాపుర కోవెల వర్ణన పాట)

క్షీరాబ్ధికన్యవై । అంబుధికి అనుంగుపట్టివై
చంద్రునకు చెలియవై । వైకుంఠవాసునకు వక్షనివాసివై
పరమపవిత్రి భాగీరథికి తల్లివై ।
ఆదికేశవులకు పట్టపురాణివై । యతిరాజవల్లివై

నర్సాపురంబున నతిముదంబుననున్న కమలనేత్రి మమ్మ
కరుణచూడు ॥

కనకకాంతిని మించుమేను పూర్ణచంద్రునిబోలు మోమును।
కరుణజూపెడు కనులును అభయహస్తమును కలిగి
ఉభయకరంబుల పద్మంబులను దాల్చి
పాదయుగ్మములనుజూపు వామ హస్తమున కలిగి
చతుర్భుజలక్ష్మివై నర్సపురంబున నతిముదంబుననున్న
కమలనేత్రి మమ్మ కరుణచూడు ॥

వె

చెలియలికట్టకు చేరియున్న శ్రీ వశిష్ఠగోదావరి ప్రాంత మున నున్న నర్సాపురమను పట్టణంబు అమరావతివలె నొప్పు చుండె నతి శృంగారముగన్ ।

నర్సాపుర కోవెల వైభవము అతి శృంగారం। ఎప్పుడు ఎవరు కట్టించిరో। ఏపుణ్యాత్ములు కట్టించిరో । ఎంతసొమ్ము పెట్టిరో దీనికి యెన్ని భూములు యిచ్చిరో వా ః।

అమ్మ యతిరాజమ్మతో ఆదికేశవులిచ్చట వెలసెను

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



కేశవు రాణిని సేవించుటకై ఎంబెరు మానారు యిచ్చట వెలసెను ।
ఆదికేశవుల సేవించుటకై ఆదిశేషుడు యిచ్చట వెలసెను ।

అమ్మ యతిరాజమ్మ అతిశయమునసంత ఉభయనాంచి మార్లు వొప్పుగ కొల్వగ ఆండాళ్ళమ్మతో ఆదికేశవులిచ్చట వెలసెను

మూలబేరులు, ఉత్సవబేరులు, తీర్థబేరులు, యాగబేరులు, బలిబేరులు, శయనబేరులు కొల్వగ నుభయనాంచి మార్లతో ప్రయాగ చక్రముతో అభయమున్నదై యతిరాజులకు సేవయివ్వగ నిచ్చట వెలసెను ఆదికేశవులు ॥ అ. న ॥

వరవరమునులు, మరి ఆళ్వారులు, గరుడాళ్వారులు, జయ విజయులు, అంజనిసుతుడు అందరు కొల్వగ ఆదికేశవులు యిచ్చట వెలసెను అతిశృంగారం । ॥ అ. న ॥

శిల్పిచెక్కిన గోపురంబులు సొంపైన శిఖరంబులు విశాలమైన మంటపంబులు ఎత్తైన ప్రహారీ గోడలు యాగశాలవాహన కొట్టు మడప్పళ్ళి మండపంబులు బలిపీఠంబులు సొంపుగ యిచ్చట కట్టించిరి. విశాలమైన ఖాళీస్థలములో నింపుగ రాళ్ళువేయించిరి. నారికేళములు నాటించిరి. ॥ అ. న ॥

నిడుపైన ధ్వజ స్తంభము, అందమైన వాహనంబులు, ఛత్రంబులు చామరంబులు, రజతబిందెలు, తీర్థపుగిన్నెలు, శంఖ చక్రములు శఠారులు వజ్రకవచములు వైరిముళ్ళు, రత్నకిరీటములు, వెలగల సొమ్ములు, పట్టుచీరలు, వెలగల వలువలు అమ్మకు స్వామికి చాలగలవు ॥ అ. న ॥

•బ్రహ్మోత్సవములు బాగుగ చేయుచు మాసనక్షత్రములు మరి మరి చేయుచు పల్ల ఉత్సవములు, పరంపద ఉత్సవములు పవిత్రోత్సవములు, కళ్యాణోత్సవములు, శుక్రవారమున సొంపుగ అమ్మకు పూజలు ఉత్సవములు ఒప్పుగ చేయుచు దశమినాడు అంజనిసుతునకు అభిషేకంబులు అందరుచేయగ అతిశృంగారం నర్సాపుర కోవిల వైభవము

ఉభయకావేరిమధ్యను రంగనాథుడు వెలసినట్టుగ పుష్ప తోటకు పుష్కరిణికి మధ్యన వెలసెను ఆదికేశవులు ఆదిశేషుని వర్ణించగలేరు చూడగ కనులుచాలవు మనకు, విద్యుద్దీపము కాంతులు వెలుగగ ఎంతో శృంగారం నర్సాపుర కోవెల వైభవము ॥ అ. న ॥

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీ రా మా య ణ కీ ర్త న



4

రామా! భద్రాచలరామా!
పరంధామా! పరమపురుషా!
సుగుణాకర సుందరవిగ్రహా రామా నను బ్రోవుమా!
శ్రీరామానను గావుమా రామా నను బ్రోవుమా!
అలనాడు దేవతలందరూ చనుదెంచి మముగావుమని వేడ
అభయమివ్వగ లేదా!
అఖిలాత్మ మీరు; ననుబ్రోవ మీకెంత నవమన్మథాకార
కుటిలచిత్తాన ననుకోపము చేయకు రామా ; నను బ్రోవుమా!
శ్రీరామాననుగావుమా!
పుత్రులకొరకై దశరథుడు పుత్రకామేష్టిచేయగ
కౌసల్యకు కడు ముద్దులపట్టివైన రామా నను బ్రోవుమా!
శ్రీరామాననుగావుమా!

విశ్వామిత్రునియాగము గావగ క్రూరరక్కసులదునుమగలేదా !
అహల్య శాపముబాపి హరుని విల్లు విరచి జనకుని కల్లుడవై
జనని జానకిని చేపట్టి పరశురాముని భంగపరచిన రామా !
నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

రాజ్యము మీకీయుగ వలదని కైక కారడవుల పంపగ వనమున
మునులై తిరుగుచు మీరు వనమునన్న తపసుల బ్రోచిన
రామా! నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

చిత్రకూటమునకుచేరి భరతుడు రాజ్యమేలు రఘురామయనుచు
పరిపరివిధముల ప్రార్థనచేయగ పాదుకలనిచ్చి పంపిన రామా
నను బ్రోవుమా శ్రీరామా నను గావుమా !

శూర్పణఖ ముక్కు చెవులునుకోసి। ఖరదూషణాది రాక్షసులను
దునిమి మాయామృగమును వేగమెద్రుంచిన రామా! నను
॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

ధరణిజను దశకంఠుడు గొనిపోవ జనకజ కొరకై అడవుల తిరిగి
జటాయువుచే జాడలు తెలిసి గృధ్రరాజుకు పరక్రియ
లొనర్చిన రామా! నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

శబరియిచ్చిన ఫలములుభక్షించి శబరికి మోక్షము సెలవొసగిన
రామా ! నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



క్రూరగుణంబులు అన్నియు నాయందు కలసని దూరముచేయుకు రామా ! నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

సుగ్రీవునితో సఖ్యముచేసి వాలిని దున్మించి సుగ్రీవునకు పట్టము గట్టిన రామా! నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

వాయునందనుచే అంగుళీయకము పంపి పరమపవిత్ర సీత జాడలు దెలిసి వారధి బంధించి లంకకు చేరిన రామా ! నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

విభీషణుని మొరవిని వేడుక మన్నించి రాక్షసబలముతో రణ మొనర్చి లక్ష్మణుడు మూర్ఛనొందగ మనుజునివలె మన మున దుఃఖించి అంజని సుతునిచే సంజీవిని తెప్పించి లక్ష్మ ణునిచే ఇంద్రజిత్తును బరిమార్పగజేసిన రామా! నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥

క్రూర రావణుని కుంభకర్ణుని దున్మించి విభీషణునకు పట్టము గట్టి సీతను పవిత్రురాలుగ జూపిన రామా ! నను ॥ బ్రో ॥ శ్రీరామా! నను ॥గా॥

భరత ప్రతిజ్ఞకు భంగము కలుగునని వాయునందనుని వేగమె

పంపి పుష్పకమెక్కి పురమున కేగిన రామా! నను ॥బ్రో॥
శ్రీరామా! నను ॥గా॥
వసిష్ఠాది మునులందరు ననరుగ పట్టముగట్టగ అనుజులవలె
అందరిని ఏలగలేదో అయోధ్యాపురవాసుడవై రామా!
నను ॥బ్రో॥ శ్రీరామా! నను ॥గా॥
రామదాసుని బంధించగ; తానీషాకు పైకమునిచ్చి రామ
దాసుని విడిపించిన రామా శ్రీరామా! భద్రాచలరామా!

———

౮

శ్రీరామచంద్రుండు । చిద్విలాసుండు
నాపాలిదేవుండు । నారాయణుండు
నా మొరాలకించి నన్నేలుగాక!

గోపాలకృష్ణుండు । గోపికాలోలుండు
నాపాలి దేవుండు । నారాయణుండు
నా మొరాలకించి నన్నేలుగాక!

నందకుమారుండు । నవనీతచోరుండు
బృందావనవాసుండు । భువనమోహనుండు
నాపాలిదేవుండు । నారాయణుండు !

వైకుంఠవాసుండు । వాసుదేవుండు
పుండరీకాక్షుండు । పురుషోత్తముండు
నాపాలిదేవుండు । నారాయణుండు !

అల్పశరీరం బిచ్చి । ఆయువధికముపోసి
ఆడజన్మంబెత్తించి । అస్వతంత్రురాలుగజేసి
అకట యిటుల కష్టములపాల్జేయ తగునె కమలనాభ
నను కాపాడి రక్షింపుమీ శ్రీనివాస !

అల్పశరీరంబిచ్చి । కామ క్రోధ లోభ మద మాత్సర్యాది గుణం
బులిచ్చి । ఆశాపాశ బంధంబువేసి అగణితంబైన సంసారమిచ్చి ।

అకట యిటుల కష్టములపాల్జేయ
తగునె కమలనాభ నను కాపాడి
రక్షింపుమీ శ్రీనివాస !

———

౯

# శ్రీకృష్ణుని పాట

ఎందుదాగినాడో కృష్ణుడు ఎందుదాగినాడో ।
సుందరరూపుడు సురరక్షితుడు
పుండరీకాక్షుడు । పురుషోత్తముడు
॥ ఎందు ॥
పండరినాథుడు పరమపవిత్రుడు
పన్నగశయనుడు పాపవిమోచకుడు
॥ ఎందు ॥
నందకుమారుడు నవనీతచోరుడు
అండజవాహనుడు । హరేమురారే
॥ ఎందు ॥
యశోదతనయుడు । వేణుగోపాలుడు
బృందావనవాసుడు । భువనమోహనుడు
॥ ఎందు ॥
కాళియమర్దనుడు । కంససంహారుడు
కరిరాజవరదుడు । కంజదళేక్షుడు
॥ ఎందు ॥
గోవర్ధనధరుడు । గోపికాలోలుడు
గోపరిపాలుడు । గోపాలకృష్ణుడు
॥ ఎందు ॥
అక్రూరవరదుడు । అభయహస్తుడు

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



అవనీపాలుడు । అరవిందాక్షుడు ॥ ఎందు ॥

నామముగలవాడు । నారాయణాంశుడు
నాతినేలినవాడు । నవమన్మథాకారుడు ॥ ఎందు ॥

శ్రీధరరూపుడు । చిద్విలాసుండు
సీతామనోహరుడు । శ్రీరామచంద్రుడు ॥ ఎందు ॥

జనకుని అల్లుడు । జయవిజయుడు
దేశసంచారి । జగన్నాథుండు ॥ ఎందు ॥

కేశవరూపుండు । కోదండపాణుడు
ఆదినారాయణుడు । ఆత్మసంరక్షకుడు ॥ ఎందు ॥

మాధవరూపుడు । మారుతివినుతుడు
కాకాసురునేలిన । కాశికాద్వారకవాసి ॥ ఎందు ॥

వాలిమర్దనుడు । వైకుంఠవాసుండు
అఖిలాండతేజుండు । ఆదినారాయణుండు ॥ ఎందు ॥

గోవిందనాముడు । గోసంరక్షకుడు
గోపికాలోలుడు । గోపాలకృష్ణుడు ॥ ఎందు ॥

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



హరిహరవినుతుడు । విమలతేజస్కుడు
విప్రవరేణ్యుడు । విశ్వాలినాథుడు ॥ ఎందు ॥
రుక్మిణీలోలుడు । రుద్రవినాముడు
రావణమర్దనుడు । రాగద్వేషాదులను రయమున ఖండించిన
కృష్ణుడు ॥ ఎందు ॥
కమలదళనేత్రుడు । కంజదళేక్షుడు
కారణభూతుడు । కార్యనిర్వాహకుడు ॥ ఎందు ॥
అచ్యుతనాముడు । అష్టాక్షరమంత్రుడు
ఆపదుద్ధారకుడు । హరిముకుందుడు ॥ ఎందు ॥
పాంచాలివరదుడు । రమాకాంతుడు
రాతినేలినవాడు । ఆత్మసంరక్షకుడు ॥ ఎందు ॥
అర్జునసారథి । విశ్వరూపధారి
అంధుని రక్షించి । అవనినేలినవాడు ॥ ఎందు ॥
కురుకులధ్వంసుడు । కుచేల వరదుడు
కువలయలోచనుడు । కుబ్జనేలినవాడు ॥ ఎందు ॥
మత్స్యావతారుడు । మానవరూపుడు
మందరగిరిధరుడు । మానినీ వేషుడు ॥ ఎందు ॥

వామనావతారుడు । వారిజాక్షుడు
వరాహరూపుడు । వనవిహారుండు ॥ ఎందు ॥

నరసింహరూపుండు । నారాయణాంశుండు
ప్రహ్లాదవరదుండు । పాపవిదూరుడు ॥ ఎందు ॥

పరశురామావతారుడు । ఆశ్రితరక్షకుడు
ఆనందరూపుడు । అరవిందాక్షుడు ॥ ఎందు ॥

రామావతారుడు । రామానుజానుజుడు
రాక్షసాంతకుడు । రవికులతిలకుడు ॥ ఎందు ॥

బలరామహితుండు । బాలకేలిసవాడు
వారిజలోచనుడు । వైరిమురారి ॥ ఎందు ॥

వసుదేవనందనుండు । వాసుదేవనుడు
దేవకిపుత్రుడు । దేదీప్యమానుడు ॥ ఎందు ॥

బుద్ధావతారుడు । బృందావనవాసుడు
సద్దులారగించువాడు । సాలిగ్రామమందు ॥ ఎందు ॥

కల్క్యవతారుడు । కరుణాసముద్రుడు
నారదలోలుండు । నారాయణుండు

భుక్తి ముక్తిని యిచ్చి రక్షించువాడు ॥ ఎందు ॥
శ్రీదేవికాంతుండు । ఆశ్రితరక్షకుడు
ఆనందరూపుడు । అరవిందాక్షుడు ॥ ఎందు ॥
భూదేవికాంతుండు । భూమిజలోలుడు
భూస్త్రాంతరకుడు । భూతదయాళుడు ॥ ఎందు ॥
నీలమేఘమువాడు । నీలాదేవి విభుడు
నిగమగోచరుడు । ఆండాళునేలిన అభయహస్తుడు
ఆదినారాయణుడు ఆత్మసంరక్షకుడు ॥ ఎందు ॥



7

# శ్రీకృష్ణుని పాట

గోవులతో దూడలతో వేణుగానా
మురళితో కరమున ఎందుదాగినాడో కృష్ణుడు ॥ ఎందు ॥
కరమున మురళిగానముతో ॥ ఎందు ॥

గజ్జెలుపావడాల్ మురడీలతో
పాదపద్మయుగళముతో ॥ ఎందు ॥

కరమున కంకణ భుజకీర్తులతో
వేణుగానం మురళితో ॥ ఎందు ॥

శంఖుచక్రములును బాజాబందులు
మురళీగానముతో ॥ ఎందు ॥

గోవులతో దూడలతో
కర్ణకుండలములు కౌస్తుభమణితో
కరమున మురళీగానముతో ॥ ఎందు ॥

వైజయంతి శ్రీవత్సముతో
కరమున మురళీగానముతో ॥ ఎందు ॥

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



వజ్రకిరీటము వనమాలతో
కరమున మురళీగానముతో
గోవులతో ॥ ఎంమ ॥
నాసికంబున నవరత్నము చెక్కిన
ముక్కుముంగెర ముత్యముతోడ
వేణుగానం మురళితో ॥ ఎంమ ॥
పొన్నలక్రింద పొలుపుగ నిలబడి
చిలుకలు ధ్వనులు చేయుచునుండగ
చిందులు త్రొక్కెటి శ్రీకృష్ణుండు ॥ ఎం। కర ॥
చుట్టూ గోపికలు సురటీల్ వేయ
నుదుటను మధ్య తిలకముతో
వేణుగానం మురళీతో ॥ ఎం। కర ॥
లంగోటాను రయముగ గట్టి
మొలనూలు నడుమున మెరయగ
వేణుగానం కరమున బట్టగ ॥ ఎం। కర ॥

కంసుని మాయలు కనుగొనవలెనని
రేపల్లెలో కాపురముండి ।
కాంతల బ్రోచిన శ్రీకృష్ణుండు || ఎం । కర ||

గొల్లల యిండ్లను గోలలుచేయగ
వెన్నలు పెరుగులు ఎత్తుకుపోయిన
వేణుగానము శ్రీకృష్ణుండు || ఎం । కర ||

పాలును మీగడ । పలుమరు త్రాగి
పట్టిదియనుచును । పనసుగ జెప్పిన
వాసుదేవుడు శ్రీకృష్ణుండు || ఎందు ||

మట్టితింటివని యశోద అడుగగ
అఖిలాండంబులు అలివకుజూపిన
వేణుగానుడు శ్రీకృష్ణుండు || ఎం । కర ||

తల్లి యశోద । రోటనుగట్టగ
ముద్దులు విరచిన ముద్దులు కృష్ణుడు || కర మురళీ ||
గోపబాలకుల గోవుల బ్రోవ ।
గోవర్ధనగిరినెత్తిన కృష్ణుడు || కర । ఎం ||

పారిజాతమును పడతికి యివ్వగ
పలుకని సత్యభామతో పాలు
త్రాగెనీ గోపాలకృష్ణుడు ॥ కర । ఎం ॥
అమృతకలశము హస్తమునుంచక
రాక్షసులను వంచించిన కృష్ణుడు ॥ కర । ఎం ॥
వక్షఃస్థలమున లక్ష్మితో వనమాలాహారముతో
ఫణిరాజు నీడనునిలచి । ఇంద్రనీలపు ఛాయలతో
ఇసుకతిన్నెల ఆడెడు కృష్ణుడు ॥ కర । ఎం ॥
బ్రహ్మాండంబులు ఉదరమునుంచుక నాభీమధ్యను
కమలముతో; బ్రహ్మకుతండ్రిగ బరగిన కృష్ణుడు ॥ ఎం । కర ॥
పుత్రుడు గోవుల దొంగిలించగా బ్రహ్మలోకమును
ఈలోకమును రెండున్ను లేకుండగ జేసిన కృష్ణుడు ॥ కర । ఎం ॥
పిచ్చిపిల్లయని పేరుపెట్టగ నాయకత్వమును
నాతికియిచ్చిన నవనీతచోరుడా ॥ ఎం । కర ॥

  

౮

రారాకృష్ణ ! రాధారమణ ! రాధికలోలా రారాకృష్ణా!
నందకుమారా ! నవనీతచోరా ! యశోద తనయా!
వేణుగోపాలా! ॥ రారా ॥

కాళియమర్దన కంస సంహారణ
గోపికలందరు గోలలుచేయగ
చీరలు పట్టుక చెట్టెక్కిన కృష్ణా ॥ రారా ॥
పట్టు పీతాంబరము వొప్పుగగట్టి
ఉత్తరీయమును గట్టిగజుట్టి
కంకణరవములు కరమున మ్రోగ
కర్ణకుండలములు కాంతులు మెరయ
కరమున మురళీగానముతో ॥ రారా ॥

కౌస్తుభమణి కంఠమున మెరయ
వజ్రపుసరులు వనరుగ మెరయ
రత్నకిరీటం రయమున మెరయగ
నెమిలిపింఛము శిరమున దాల్చి

తిరుమణి శ్రీచూర్ణముదాల్చి
ఒప్పుగ శౌలువ కప్పుక ॥ రారా కృష్ణా ॥
నీలమేఘశ్యామా । నీకుమ్రొక్కెద
పరుగున రారా । పన్నగ శయనా ।
మురళీకృష్ణా । ముద్దులకృష్ణా ॥ రారా ॥ రాధా ॥

## 9

## శ్రీ కృష్ణుని పాట

పద్మరేఖలమీద పాదములు ఉంచి। పట్టు పీతాంబరము ఒప్పుగా ధరియించి । ఉత్తరీయము నెమలనుగట్టిగాజుట్టి। కస్తూరి తిలకము ముఖమున దిద్ది । గజ్జె లందెలు ఘల్లునమ్రోగ । కంకణ రవములు కరమున మ్రోగ । శంఖచక్రకాంతి తేజరిల్లగను । వామకుండలములు ఒప్పుగా మెరయ । వైజయంతి శ్రీవత్స మున మెరయ । కౌమోదకము కాంతులుమెరయ । కౌస్తుభ మణి కంఠమున దాల్చి । వనజాక్షి లక్ష్మిని వక్షమున దాల్చి । వజ్రస్థాపితమైన వరుసదండలుదాల్చి । వరుసకు దండలు వనమాల

దాల్చి రత్నకిరీటము రంజిల్లదాల్చి ॥ మణిమయ హారములు ఉరమునదాల్చి ॥ శిరమున పింఛము ముదముతోదాల్చి ॥ మురళీ గానముతోను ముద్దులొలుకుచున్న నీలవర్ణుడ నేను ॥ నీకు మ్రొక్కెదను ॥ అన్యచింతలులేక అనరవతము నిన్ను శ్రేష్ఠ మ్రొక్కెద వేణుగోపాల ॥ చిత్తంబు నీమీద చేర్చియుండేటట్లు వొప్పుగా చేయుమీ వైకుంఠవాస ॥ తప్పులెన్నున్నను తలచక నన్ను కరుణచూడవయ్య కమలనేత్రుడ ॥ నీకంటె నాకింక ఇతరు లెవ్వరులేరు ఇందీవరాక్షా ॥

## 10

## శ్రీ కృష్ణుని మేలుకొలుపు

కృష్ణ మేలుకో సత్యరుక్మిణిలతో స్వామి మేలుకో ॥ కృష్ణ ॥
తిరుమణి శ్రీచూర్ణధారుడ శ్రీలక్ష్మి వక్షనివాసుడ ॥ మే ॥
నీలమేఘశ్యామ నీలా భూదేవులతో ,,
ఆశ్రిత రక్షకుడ అరవిందాక్షితో ,,
నారదాదులునిన్ను పాడుచువచ్చారు నవనీతచోరుడ ,,
పీతాంబరధరుడ పింఛవిహారుడ ,,

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



శంఖచక్రధర! సనకసనందాదులు నిన్ను స్తుతింపవచ్చారు ॥ మే ॥
రత్నకిరీటుడ రమాకాంతజ్ఞో ,,
కౌస్తుభమణిధరుడ కరిరాజు నీకై మొరపెట్టుచున్నాడు
విడిపించబోవలె ,,
వనితలందరు నీ వ్రతముచేయవచ్చిరి వైకుంఠవాసుడ ,,
వాతాత్మజుడువచ్చి వాకిటనున్నాడు వనమాలధరుడ ,,
దేవకీ వసుదేవనందన దేదీప్యమానుడ ,,
నందయశోద సంరక్షక; సతి రాధామణి వచ్చె ,,
కాళియమర్దన కంస సంహారక ,,
గోవర్ధనధర గోవులునీకై ఘోషించుచున్నవి
పోషింప జనవలె పుండరీకాక్షుడ ,,
అక్రూరవరదుడ ఆవరోడి సన్నుత అభయమివ్వగవలె ,,
పారిజాతహరుడ పాంచాలివరదుడ పన్నగశయనుడ
అమృతభాగుడ అర్జునసారథి అనిరుద్ధనాముడ ,,
కురుకుల ధ్వంసుడ కుచేలవరదుడ కుబ్జనేలినవాడ ,,
ధరణిపాలక ద్వారకావాస దశరథనందన ,,

మానవరూప మానినీ వేష
మగువలందరు నిను వరము వేడవచ్చారు ॥ మే ॥
మత్స్యావతారుడ మందర గిరిధరుడ ,,
వామనావతారుడ వరాహరూపుడ ,,
నరసింహరూపుడ ప్రహ్లాదవరదుడ ,,
పరశురామావతారుడ భార్గవ వంశజుడ ,,
రామావతారుడ రామానుజానుజుడ రవికుల తిలకుడ ,,
బలరామకృష్ణులు యదుకులతిలకులు
కువలయాపీడమును కూల్చినట్టి ఘనుడ ,,
బుద్ధావతారుడ బృందావనవాసుడ సద్దులారగించవలె ,,
కలికావతారుడ కరుణాసముద్రుడ కాకుత్స్థతిలకుడ ,,
శ్రీరంగనాయక శ్రీమాడికుడుతమ్మలో మేలుకో
శ్రీరంగా మేలుకో
శ్రీ బదరీనాథ అరవిందాక్షుడో మేలుకో బదరీశ మేలుకో
ఏడుకొండలవాడ వెంకటరమణుడ మేలుకో శ్రీ వెంకటేశా ,,

శ్రీ భూనీలాదేవులు మీరు సాక్షి పవళించిరు మేలుకో
శ్రీలక్ష్మి మేలుకో అమ్మ ఆండాళు అలివేలు మేలుకో
అనంతాళ్వారులు మీరు విభూతినాయక మేలుకొనుడీ।
గరుడాళ్వారులు మీరు గజరాజవరదుని మోసె
సమయమాయె మేలుకొనుడీ॥
విష్వక్సేనాళ్వారులు మీరు విభవము లేలవలె మేలుకొనుడీ
వియ విజయులు మీరు జయభేరి వేయవలె మేలుకొనుడీ।
నమ్మాళ్వారులు మీరు ఆయిర ప్రబంధము వ్రాసె
సమయమాయె మేలుకొనుడీ॥ ఆళవందారులు మీరు
హరిని పాడగ వేళాయె మేలుకొనుడీ॥
శ్రీ భాష్యకార శ్రీ భాష్యము మరిగ వ్రాయవలె మేలుకొనుడీ॥
వరవరమునులు మీర్థు వొప్పుగ ప్రబంధములు పూర్తి
చేయవలెను మేలుకొనుడీ॥
నంబిళ్లాచార్యులు మీరు గోష్ఠి కేగె సమయమాయె మేలుకొనుడీ।
అంజనిసుతుడ అమ్మకుంగరమీయవలె మేలుకో
శ్రీ ఆంజనేయ మేలుకో

# 11

## శ్రీ ఆండాళు మంగళహారతి

శ్రీభూనీలాదేవులింతచలమునాపై చేయతగునా । సంతానము మీా కేల పంకజయన సుంతైన దయలేదా సుందరవదనా। పామరులనెల్ల పాలించగా నీవు పడతివై పుట్టి । పరమపవిత్రి , ప్రకృతి జనులను పాలించిన తల్లీ మంగళమిదే ॥

అండలోపుట్టియు ఆండాళువై నీవు । పెరియాళ్వారుకి పెంపుడుబిడ్డవై। వటపత్రశాయికి వనరుగ మీాతండ్రి । దండలు గట్టగ ధరించినతల్లీ ॥ మంగళం

ఆవేళ పూదండలు అపచారమనిమాన , నీవుధరించిన నా ప్ట మంచును ఆనతిచ్చినట్టి , ఆదిమూర్తిని నేను అనవరతము ప్రెముక్కెద ఆండాళమ్మ ॥ మం

క్షేమకరమునుకొరకు వ్రతముచేయగ నీవు । వనితలతోగూడి వయ్యారినీవు । దీక్షపట్టిన నీవు దినదినము యింటింట , తిరగుచు ఇంపులేపుచు వ్రతము సలిపిన ఆండాళమ్మ నీకు ॥ మం

గోవిందునిగూడ గొల్లవేషముదాల్చి । ముప్పది పాటలు ముదముతో పాడుచు । వనితలతోగూడి వ్రతముచేయగ నీవు వటపత్రశాయిని వాయిద్యములడిగిన । అంబుజనయనా ॥ మం

వరుసపూగెండలతో వజ్రకిరీటముతో । వయ్యారినడకలతో వొప్పగ పొరపాటు వనగుగచేయగా అడుగడుగున హారతు । లివ్వగా రత్నహారములతో రంజిల్లగా నీవు । అతివలందరుచుట్టు ఆనందముగా నడువ । పొంగుచు ఉంటివి పొలుపొందగా తల్లీ ॥ మం

శ్రీరంగనాథుని చిత్తమునజేర్చి । చేడెలతో గూడి చేరి వ్రతముచేసి । అర్చావతారుని ఆరంగనాథునితో ఐక్యమైన తల్లీ ॥ మం

రంగనాయకీ । రక్షణి ఆండాళుకు జయమంగళమిదే ॥ మం

## 12

రత్నశ్రీచూర్ణము స్ఫటికతిరుమణిరో । నీకెవరిడిశే ఆండాళు బంగారు వాలుజెడ రంగైన కిరీటము రమణిరో । నీకెవరిడిగే ఆండాళు । మంగళసూత్రాలు మణిమయహారములు ॥ మగు

వకో నీకెవరిడిరే ఆండాలు । కంకణరవములు కమ్మలుజుమికీలు కాంతకో నీకెవరిడిరే ఆండాళు । పగడాల దండలు పచ్చల హారములు । పడశిరో నీకెవరిడిరే ఆండాలు, వరసపూదండలు వనమాల వయ్యారి నీకెవరిడిరే । అందమయిన జలతారు చీర ఆండాళు నీకెవరిడిరే । లక్షపుష్పములు నీకు అర్చనచేయగ । సుదతులందరుగూడి సురటీలు వేయగ చుట్టు స్వాములు నీకు అర్చనచేయగ । అతిముదముతో హారతులివ్వగ పుష్పరాశిపై పాలుపొందుచు నీవు । రంగనికొరకు రమణి వ్రతముచేయ । శ్రీరంగనాధుని చిత్తమునజేర్చ । చేడెలతో గూడి చేవ్రతము జేసి । అర్చావతారుని ఆరంగనాధుని పరిణయమాడిన । పంకజ నయనా మంగళమిదే । రంగనాయకి రమణి ఆండాళుకు ॥ జయమంగళమిదే ॥

## 13

## శ్రీరంగనాయకుల మంగళహారతి

బంగరు పాదములు రత్నకడియాలతో । రంజిల్లు మణిమయ హారములతో । శేషపాన్పున శయనించివున్నట్టి శ్రీరంగనాథుని చేరి కూర్చున్న శ్రీ ఆండాళుకు । మంగళంబులు ॥

రత్నాలు స్థాపిన రంజిల్లుపదములు । ఉభయనాంచారులు నొత్తుచునుండగ । ఏవర్ణించియున్నట్టి పన్నగశయనునకు ॥ మం

పద్మరేకులమీద పాదములుఉంచి । పట్టుపీతాంబరము నొప్పుగా ధరియించి । ఉత్తరీయమును మొలను గట్టిగాచుట్టిన వైయారి రంగనికి ॥ మం

వరుసముత్యాలతో వజ్రస్థాపితమైన కవచముతో । వనజాక్షితో శయనించియున్నట్టి శ్రీరంగనాథునకు ॥ మం

కరమున కంకణరవములతో శంఖుచక్రములతో । పచ్చల హారముతో పడతి ఆండాళుతో పవళించియున్నట్టి పన్నగ శయననకు ॥ మం

రత్నస్ఫటికములతో రంజిల్లు స్వరూపముతో । కర్ణకుండ ములు కాంతులుమెరయ । ఇక్ష్వాకుడొసగిన ముక్తాంగిమెరయ రమణి శ్రీలక్ష్మితో రంజిల్లు కిరీటముతో । శేషపాన్పుపై శయనించియున్నట్టి శ్రీరంగనాథునకు ॥ మం

వక్షమున లక్ష్మి వనమాలహారములు । వజ్రాలహారములు వరుసగా మెరయ । వయ్యారి రంగనికి ॥ మం

లక్షనామంబులతో హెచ్చుగా భూసురులు । శ్రీదేవికి శ్రీచూర్ణము అర్చనచేయగ । అరావతార్చరుని ఆరంగనాథుని వక్షమున నున్నట్టి వనజాక్షికి ॥ మం

## 14

## శ్రీకృష్ణుని మంగళహారతి

మంగళం శ్రీ మదనగోపాలునకు ।
శ్రీ రుక్మిణీ సత్యభామాసమేతునకు
తిరుమణి శ్రీచూర్ణధారునకు
శ్రీలక్ష్మి వక్షనివాసునకు ॥ మం ॥
నీలమేఘశ్యామునకు నీలాభూసమేతునకు
ఆశ్రితరక్షకునకు అరవిందాక్షునకు ,,
నారదలోలునకు నవనీతచోరునకు ,,
దేవకీ వసుదేవ నందనునకు దేదీప్యమానునకు ,,
నందయశోద సంరక్షకునకు సతిరాధా మనోహరునకు ,,
శంఖచక్రధారునకు సనకసనందన వినుతునకు ,,
కౌస్తుభధారునకు ఖగరాజ వరదునకు ,,

రత్నకిరీటునకు రమాకాంతునకు ॥ మం ॥
పీతాంబరధరునకు పింఛవిహారునకు ,,
వైకుంఠవాసునకు యదుకుల తిలకునకు ,,
కాళియ మర్దనునకు కంససంహారునకు ,,
గోవర్ధనధరునకు గోసంరక్షకునకు ,,
అక్రూరవరదునకు అభయహస్తునకు ,,
పారిజాతహరునకు పాంచాలివరదునకు ,,
అమృత భాగునకు అర్జునసారథికి ,,
కుచేల వరదునకు కురుకుల ధ్వంసునకు ,,
ధరణిపాలునకు ద్వారకావాసునకు ,,
వాసుదేవునకు వరప్రసాదునకు ,,
మత్స్యావతారునకు మందరగిరిధరునకు ,,
వామనావతారునకు వరాహరూపునకు ,,
నరసింహరూపునకు ప్రహ్లాదవరదునకు ,,
పరశురామావతారునకు భార్గవవంశజునకు ,,
రామావతారునకు రామానుజానుజునకు ,,
బలరామకృష్ణులకు యదుకుల తిలకునకు ,,

బుద్ధావతారునకు బృందావనవాసునకు ॥ మం
కలికావతారునకు కరుణాసముద్రునకు ।
శ్రీరంగనాథునకు శ్రీ వేంకటరమణునకు ,,
శ్రీబదరీనాథునకు శ్రీ భూనీలాదేవులకు ।
ఆండాలుకు అలివేలుకు ,,
భాష్యకారులకు వరవరమునులకు ,,
అంజనీసుతునకు గరుడాళ్వారులకు జయవిజయులకు ॥ మం

## 15

## శ్రీ ఉడయవరుల మంగళహారతి

శ్రీ భాష్యకారులకు శేషావతారునకు ।
జయ భాష్యకారునకు జయ మంగళం ॥
కాంతిమతీ పుత్రునకు కాషాయధారునకు
శ్రీభాష్యకారునకు శేషావతారునకు ॥ జయ మంగళం ॥
ఊర్ధ్వపుండ్రములు వొప్పుగదాల్చి । సువర్ణాంజలి సొంపుగదాల్చి
రత్నటుంగరములు రంజిల్లదాల్చి । మణిమయహారములు

ముదముతో దాల్చి వరుసపూదండలు వనమాలదాల్చి ।
తిరుముడి శిరమున తీరుగదాల్చిన । శ్రీభాష్యకారులకు
శేషావతారులకు జయభాష్యకారులకు ॥ జయ మం ॥
రత్నస్ఫటికముతో రంజిల్లు స్వరూపముతో
శంఖశక్రికాంతి తేజరిల్లగను । వక్షమున
త్రిదండము ఒప్పగదాల్చిన వుడయవరేణ్యునకు శ్రీభాష్యకారులకు
శేషావరులకు । జయభాష్యకారులకు ॥ జయ మంగళం ॥

## 16

## యతిరాజవల్లి శుక్రవారోత్సవ మంగళహారతి

మంగళమిదెగొనుమా । యతిరాజవల్లీ తల్లీ కల్పవల్లి ॥మం॥
వరసపూదండలతో వనమాలతో । మిసమిసలాడేటి నేల్ పట్టుచీరతో । వజ్రకిరీటముతో నొప్పగ ఉయ్యాల తొట్టెలో కూర్చున్న వనజాక్షికి ॥ మం ॥

గజ్జలవడ్డాణము ఘనమైనకంటె। వజ్రపు పతకములు వరుసగా మెరయ । కాసుల దండల కాంతులు మెరయ , మిరియాల పేరులు ముదముతో దాల్చి। వరుస పూదండలు వనమాల దాల్చి , తిరుముడి శిరమున తీరుగదాల్చిన శ్రీదేవికి ॥ మం

కంకణ రవములు కరమున మ్రోగ : కమ్మలు జుమికీలు కాంతులు మెరయ । యిరుగడల చామరములు యింపుగదాల్చి తొట్టెలో కూర్చున్న ఒప్పులకుప్పకు వనజాక్షికి ॥ మం

అనంతాచార్యులుగారు అలంకారముచేయ । పురజనులందరు పూని అర్చనలు చేయింప। అర్చకులందరు పూజలుచేయ స్వాములందరుగూడి సేవాకాలముచేయ , పులిహోర శుండలి ఆరగింపులుచేయ । దాసుడు ముదముతో పాటలుపాడ । అడుగడుగుకు హారతులిచ్చుచు కృష్ణమూర్తిగారు ఎంతో ఉత్సవముచేయ । తూగుటుయ్యాలలో ఊగుచున్నట్టి । యతిరాజవల్లికి ॥ మం

స్త్రీ పురుషులందరు చేరి సేవింపగ । లాలిపాటలు పాడ

తూగుటుయ్యాలలో । ఊగుచునున్నట్టి వనజాక్షికి ॥ మం

శ్రీ భాష్యకారులు సేవించుచుండగా । ఆదికేశవుల అంకమున నుండేటి యతిరాజవల్లికి ॥ మం

జోలలుపాడుచు జోహారులిచ్చుచు హెచ్చుగా భూసురులు అర్చన చేయగ ఆళ్వారు పుత్రికి ॥ మం

తీర్థప్రసాదాలు వినియోగముచేయ । సత్యనారాయణగారు శెలవియివ్వ । అతిముదముతో అందరు వినుతులొనర్చ । తూగుటుయ్యాలలో ఊగుచు నున్నట్టి అంబుజనయనకు మంగళమిదే ॥ మం

# 17

## శ్రీ రామానుజులవారి పాట

శ్రీ రామానుజులవారి మతమే యిలలో స్థిరమనినమ్మండి ।
ఇతర మతంబులు వాంఛలలోపడి గతులుతప్పకండీ ।

పంచ సంస్కారపరులు పరమపావనులు ।
పతితుల బ్రోచెడి పరమ పవిత్రులు ।
ఇలలో ఇళయాళ్వారని పేరుగాంచిన ఘనులు ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ
శ్రీ కృష్ణార్పణమస్తు.



రాజ్యలక్ష్మి ప్రెస్ - నర్సాపురం.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 9 | ప్రాజలు | ఉంజీలు |
| 6 | 10 | కుటిల చిత్తాననను | కుటిల చిత్తనని |
| 7 | 1 | దునుమగలేదా | దునుమగలేదా రా॥ |
| | 5 | కారడవుల | కారడవులకు |
| 8 | 2 | నను ॥బ్రో॥ | నను దూరము చేయకు రామా |
| 9 | 4 | గోపాలకృష్ణుండు | గోపాలకృష్ణుండు గోవర్ధనుండు గోపరిపాలుండు |
| 10 | 2 | భువన మోహనుండు | భువన మోహనుండు నా। మొ॥ |
| | 6 | నారాయణుండు | నారాయణుండు నా। మొ। |
| | 11 | లోభ మద | లోభ మోహ మద |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 10 | మురళీగానముతో | కరమున మురళీగానముతో |
| 17 | 15 | బట్టగ | బట్టుక |
| 18 | 4 | గోలల | గోలలు |
| | 6 | వేణూగానము | వేణూగానుడు |
| 21 | 2 | కప్పుక | కప్పుక రారా |
| | 9 | ముఖమున | ఘనముగా |
| | 14 | వరునకు దండలు | వరుస పూదండలు |
| 26 | 2 | పంకజయున | పంకజనయన |
| | 9 | నీవు ధరించిన | నీవు ధరించినవే నాకిష్ట |
| | 10 | మంచును | మనుచును |
| | 13 | దీక్షపట్టిన | దీక్షపట్టియు |
| 27 | 5 | అడుగడుగు హారతు | అడుగడుగుకు హారతు |
| | 7 | ఉంటవి | ఉంటిని |
| | 12 | ఠంగనాయకీ | రంగని నాయకీ |
| | 13 | తిరుమణిరో | తిరురమణి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 27 | 14 | రమణిరో | బాలరో |
| 28 | 5 | ఆండాలు నీకెవరిడిరే | భక్తులందరుగూడి భజనలు చేయగ |
| | 14 | బంగరు | బంగారు |
| | 15 | శేషపాన్పున | శేషపాన్పుమీద |
| | 16 | మంగళంబులు | మంగళమిదే |
| 29 | 6 | వజ్రస్థాపితమైన | పతకములతో రత్నాలు స్థాపిన రంజిల్లు |
| 32 | 6 | | అనంతాళ్వారులకు విష్వక్సే నాళ్వారులకు నమ్మాళ్వారులకు ఆళవందారులకు |

—(०)—